# సతీహిత సంగ్రహము.

ఇది

బాలికలకు నుపయుక్తంబుగ

---

కడపలో నుండెడు

గన్నైల. రామానుజులు నాయని వారిచే

రచింపఁబడి

---

చెన్నపురిశాఖానగరమగుతిరువల్లిక్కేణిలో[illegible]నియున్న

సంజీవనీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె,.

---

౧౮౭౪ సం॥ జూలై ౯ తేది.

# పీఠిక.

విద్య యావశ్యకమను టెల్లరకును దెల్లంబు గానఁ బురుషులకువలె స్త్రీలకు నది యుచితంబు.

గృహ కృత్యములెల్ల నిర్వాంద్రవి యవుటంజేసి, వారికి నీతి సదాచారము మొదలగు సద్గుణములు గలిగి యుండుటకై గ్రంథములు రచియింపఁబడి యుండవచ్చును. అయిన, కేహినులకు విద్యవలని ఫలము పాతివ్రత్యమే యనియుఁ, దత్సదాచారపరిజ్ఞానమునకుఁ జదువు సముచిత సాధనమనియు నిరూపించు సమంచిత గ్రంథము లరుదుగ నున్నవి. ఉండెడు నొకటి రెం డాధునిక కృతులును, ప్రాచీన గ్రంథ భాగములును నానావిషయ బోధకములుగఁ బరమ సంక్షేపములుగ, విశేష విద్యాబలముగలవారికిఁ దప్ప, నిస్సంశయముగ నైజముగ దుర్లభములై నవిగ నున్నవి.

కాఁబట్టి సతీ హిత సంగ్రహ మనుపేర నీ పుస్తకమును సమకూర్చితి. ఇందు మొదటిభాగము, కేవల వాక్యములు. వీనిలోనివి కొన్ని, శిష్టు- కృష్ణమూర్తి శాస్త్రిలవారు రచియించిన స్త్రీనీతిశాస్త్రమను పద్య కావ్యమున నుండి సంగ్రహింపఁబడినవి. శేషించిన మూఁడు భాగములు, శ్రీమహాభారతమునుండి ప్రకృత ప్రస్తావ పోషణంబునకై సంగ్రహింపఁబడిన సావిత్ర్యుపాఖ్యానము, పుణ్యసతీ ప్రభావము, సత్యా ద్రౌపదీ సంవాదమునుగా నుండెడును.

శ్రీరస్తు.

---

# శ్రీ నీ తి వా క్య ము లు.

౧. [౧]అనృత మన్ని పాపములలో నధికము.

౨. అన్ని దానములలో నన్నదానము శ్రేష్ఠము.

౩. అత్తమామలపై భక్తినుంపు- వారిమాట దాటక [౨]యాలకింపు- వారినిఁ బూజింపు- వారికడఁ [౩]గసరుకొనకు.

౪. [౪]అతిథుల కన్నముఁ బెట్టు- వారిమీఁద కోపము నణఁపు.

౫. [౫]అణువుగ తిండి, [౬]యాత్మేశునకుఁ బెట్టు.

---

౧. అసత్యము
౨. విను
౩. కోపగింపకుము
౪. యాచకులకు.
౫. తక్కువగా
౬. మగడు

# స్త్రీనీతి వాక్యములు.

౬. అప్పుఁ జేయవలదు.

౭. అరుణోదయమున[౧] మేల్కాంచి - దంతధావన[౨] మొనర్చుకొను.

౮. అహంకారమును[౩] మాను.

౯. అకాల[౪]ాహార[౫] నిద్ర లసౌఖ్యకరములు[౬].

౧౦. అన్యపురుషు నన్నగాఁ జూడు- చూచి నవ్వకు.

౧౧. అప్ప చెల్లెలు మొదలైనవారి నాదరింపు.

౧౨. అల్లుని నంతకు హెచ్చుగ నాదరింపు(దుహితకై[౭])

౧౩. అన్నదమ్ములు వేరుపడ నీక, వేరు గాఁ[౮]గూడదు.

---

౧. తెల్లవార.
౨. పండ్లుతోముకొను.
౩. గర్వమును.
౪. కానివేళయందు.
౫. భోజనము.
౬. అసౌఖ్యముఁజేయునవి.
౭. కూఁతుకై
౮. మూలము.

౧
౧౪. అన్నిట శుచిగ నుండుట యందము.

౧౫. ఆటుతో, నింటి ముందటి యావరణముఁ జేరకు- (ఇంటివెనుక నుండు.)

౨ ౩ ౪
౧౬. అంక లేఖనముల నభ్యసింపు- (ఈవాహ్యాదుల లెక్కఁబెట్టను, ఇటుల వ్రాయను-)

౫
౧౭. ఆడి తప్ప వలదు.

౧౮. ఆఁడుబిడ్డల యాలి కడ్డపడకు.

౬ ౭
౧౯. ఆభరణములలేమి కలుగకు.

౨౦. ఆత్మహత్య గూడదు.

౧ పరిశుద్ధముగ.
౨ అంకె.
౩ వ్రాఁత.
౪ నేర్చుము.
౫ చెప్పి.
౬ సొమ్ములు లేకపోవుటకు.
౭ కోపింపకు.
౮ తన్నుహింసించుకొనుట.

# స్త్రీ నీతి వాక్యములు.

౨౧. ఆత్మేశు సన్నిధి ననుభవములఁ గోరకు.

ఆతని రాకఁ గోరు. (తలయంటుకొనుట, రుచికరమును బలకరమునగు తిండి దినుట. సింగారించుకొనుట)

౨౨. ఆత్మేశుఁ డుండుమన్నచో నుండు.

౨

౨౩. ఆతురత యేరికిని బనికిరాదు.

౩

౨౪. ఆపదఁ జెందినవేళ, నాపద్బాంధవు స్మరింపు.

౨౫. ఆశఁబెట్టి, మోసపుచ్చకు.

౪

౨౬. ఆరాధనము నుం డాహారము గూడదు (దేవతార్చన గృహములలోను)

౧ దగ్గరలేనప్పుడు. ౩ భగవంతుని.

౨ తొందర ౪ దేవపూజకు.

౨౭. ఇహ[౧] పర[౨] సాధన[౩] మెదియో చూడు[౪].

౨౮. ఇచ్చి వగచుట[౫]. పిచ్చితనము.

౨౯. ఇట్టి పుస్తకములఁ జదువు- (౧౬౯ - ౨౩౬ - ౨౪౪- వాక్యములఁ జూడు.

౩౦. ఇరుగు పొరుగులను, బరుషములాడకు[౬].

౩౧. ఇల్లామల్లిలేని[౭] మెతుకుమంతయు[౮] వలదు.

౩౨. ఇల్లాలు చెడునైన[౯], నింటి కపకీర్తి[౧౦].

౧ ఇహలోకము
౨ పరలోకము
౩ ఉపాయము
౪ యోచింపు
౫ వంతించుట
౬ కఠినపుమాటలు
౭ ఒకచోటి మాట మఱి యొకచోటఁజెప్పి కలహముఁగలిగించుట.
౮ కొంచెమైనను
౯ దుష్టురాలు
౧౦ వంశమునకు

# స్త్రీ నీతి వాక్యములు.

౩౩. ఇంటిగుట్టు[౧], రట్టుపఱుపకు[౨].

౩౪. ఇంటిపనులకు నొంటికత్తె యనకు (పనివాండ్ర నుంపు)

౩౫. ఇంటివాకిట నొంటిగ నిలువకు.

౩౬. ఇల్లువాకిండ్లఁ బరిశుద్ధముగ నుంపు.

౩౭. ఈవి కడ్డుపడకు.

౩౮. ఉలికి యులికి నడవకు.

౩౯. ఊరక ప్రొద్దుఁ బుచ్చకు.

౪౦. ఊరక వక్కాకు నమలకు.

౪౧. ఊరు తిరుగఁ బోకు.

౪౨. ఋజుమార్గ[౩] ప్రచారము మేలు.

౪౩. ఋణమును దీర్చి బ్రదుకు (అప్పుఁజేసిన)

౪౪. ఋతుమతిత్వము సప్రతిరముగ[౪] జరుపు.

౧ రహస్యము
౨ వెల్లడిచేయకు
౩ కపటములేనినడవడి
౪ అంటుపడకుండునట్లు తగినట్టు గుట్టుగా

౪౫. ఎవరి కెది విహితమో[౧], వారు దాని నేర్వవలె.

౪౬. ఎంత దొరకిన, నంతతో సంతసిలు.

౪౭ ఎంతకైనను బరపురుషునిపై[౨] మనస్సుఁ బాఱ
నీయకు (అది మానసిక[౩] పాపము)

౪౮. ఏమఱి[౪] నిద్దురఁబోకు.

౪౯. ఏలినపతి నెప్పటికి విడువకు.

౫౦. ఐశ్వర్యమున[౫] కణఁకువ[౬]బంగారుకుఁ బటికవలె.

౫౧. ఒరులఁ[౭] జెఱుపకు. (చెఱిచితివా చెడెదవు)

౫౨. ఒడలు[౮] చూచుకొని వెడలు. (మానమునకై)

---

౧ తగినదో
౨ మగనికంటె నన్యునిపై
౩ మనస్సునఁగలిగినది
౪ పరాకుపడి
౫ సంపదకు
౬ వినయము
౭ అన్యుల
౮ దేహము

౫౩. ఒంటిగఁ దిరుగఁ బోకు.

౧

౫౪. ఓర్వలేమి యజ్ఞానులకు సహజము.

౫౫. ఓర్పు గలిగియుండుము.

౨

౫౬. ఔదార్యమున కణఁకువను జేర్పు.

౩

౫౭. కన్నవారినిఁ గనికరింపు.

౫౮. కష్ట సుఖములు గలసియుండును.

౪

౫౯. కానివారి తెరువునకుఁ బోకు.

౫ ౬

౬౦. కాయము నిత్యము గాదు.

౬౧. కాళ్ల చక్కఁగఁ గడుగుకొనుము.

---

౧ సముద్రములోనుండి యుండవలె నీళ్లఁ దీల్పు చుండు నిప్పు.

౨ ఔదార్యము.

౩ తల్లిదండ్రులను

౪ పగవారిజోలికి.

౫ ఒడలు

౬ ఎప్పటికి నుండునది.

౧

౬౨. కితవుల చెంతఁ జేరకు.

౨

౬౩. కినుక దెచ్చికొనకు.

౬౪. కీర్తి నొందఁ గోరు.

౩

౬౫. కుటిల బుద్ధి మాను.

౬౬. కుదురులేక నడవకు- (అందుకే, పావడములు)

౪

౬౭. కుత్సిత బుద్ధి గూడదు.

౫

౬౮. కుజనులఁ గూడఁ గూడదు.

౬౯. కుట్టుపనుల నేర్చికో (మెట్టుకైన జీవింపః)

౬

౭౦. కృతము, మఱవఁగూడదు.

౧ జూదగాండ్రు ౪ నీచము
౨ కోపము ౫ దుర్జనులు
౩ వంకర ౬ పరులుచేసిన మేలు

౭౧. కృషికులు[౧] కృషివలుఁ దీర్పవలె - (కూలి పెట్టిన, కూటికో)

౭౨. క్రూరకర్మ[౨] గూడదు.

౭౩. కొడుకులఁ గూఁతులఁ గొట్టకు-(విన్నఁగా దిద్దు)

౭౪. కొలతఁ దెలిసి కొనుము (మునుగు కెంతయైన దీసె కెంతయని)

౭౫. కొండెములఁ[౩] జెప్పకు.

౭౬. కొంగఁ[౪] గూల్చిన కోపి, కోమలికి నులిక్కి చిన్నదయ్యె. (పతివ్రత ప్రభావ మిట్టిది)

౭౭. కోడలినిఁ గూఁతువలెఁ జూడుము. (కోడలికి "దీపావళికి దీపావళికి" అని త్వర త్వరగను, కూఁతునకు,

---

౧ దున్నుకొను వారు ౪ పుణ్యసతీత్ర భావము ౬౫
౨ భయంకరమైనపని పుట్టయూదఁగఁ జూడు.
౩ చాడీలు

"ఎప్పుడో వారమున కొకతేప,, అని తిన్నఁగ
ను ఎందుకుఁ జెప్పవలె)

౭౮. ఖల సాంగత్యము[౧] కీడు.

౭౯. గర్జన[౨], తర్జనాదులకుఁ[౩] బతిని వర్జింపకు[౪].

౮౦. గయ్యాళి యనుపేరు గర్హితము[౫].

౮౧. గర్వము పనికి రానిది.

౮౨. గాయమును కట్టిమాన్పు (లేకున్నఁజెడ్డదగు)

౮౩. గాంధారిపతివ్రత కన్నులఁ గట్టికొనె(అతఁ డంధుఁ
డైనందున)

౮౪. గాంభీర్యమును గలిగియుండుము. (గౌరవమునది[illegible]
గించును.)

౮౫. గుణము గణనీయముగ[౬] నుండనీ.

౮౬. గురుజన భక్తిపూజలు కొనియాడఁదగినవి.

---

౧ దుర్జన సాహవాసము ౪ విడువకు

౨ కఠినపుమాట ౫ నిందితము

౩ బెదిరించుట మొదలైనవి ౬ ఎన్నఁదగినది

౮౭. గేహకార్య[౧] నిర్వాహశక్తి బూనను.
౮౮. గొణుగుట కొఱగానిది.
౮౯. గోప్యములను[౨] గోప్యముగ నుంచు- జరుపు.
౯౦. గోష్ఠములకేగ గూడదు. (కూరలు పానిపోను.)
౯౧. గృహమున కరుదెంచిన[౩], యతిథి,భిక్షు బాంధవులకు గుడుపఁబెట్టుట[౪] గృహిణి[౫] పని.
౯౨. చక్కఁగఁ దల దువ్వి, కొప్పుఁబెట్టుకో (వెండ్రుకలు, వంటపాత్రలలోఁ బడకయుండ)
౯౩. చాడి చెప్పవలదు- చాడిమాటల వినకు.
౯౪. చాపలమున భయపడఁ గూడదు-(పుట్టింటికిఁబోవుటకు.)
౯౫. చంచలాంగికిఁ[౬] బ్రహ్మచారిణము సుగుణము.

---

౧ ఇంటిపనుల నేర్పేర్పు సామర్థ్యము.
౨ రహస్యములను
౩ వచ్చిన
౪ అన్నముఁబెట్టుట
౫ ఇల్లాలు
౬ స్త్రీకి

౯౬. చిత్తమును[౧] దంభవృత్తులకుఁ జేర్పకు.

౯౭. చిత్రాంగి[౨] యని చెప్పఁబడరాదు.

౯౮. చిత్తము దుర్వ్యక్తులఁ[౩] జేరనీకు.

౯౯. చెప్పినవెంటనే చేయుము.

౧౦౦. చెంబుదాకెలల, సొట్టలుపోఁగొట్టకు- (అప్పుట పైలచేరు)

౧౦౧. చెంబుఁబట్టికొని చెట్లమఱుఁగున కరుగకు-(పోకిరీలు చూతురు. ఇందుకే ౧౫ వవాక్యమును)

౧౦౨. జగదీశ్వరుని జను లారాధింపవలె.[౪]

౧౦౩. జానకీపతి[౫] భజన, చంచలాంగులును జేయఁదగు.

---

౧ దంభాచారములకు

౨ రాజరాజనరేంద్రుని చిన్న పెండ్లాము- అతి దుష్టురాలు, మహాపాపాత్మురాలు.

౩ చెడ్డనడవడులను

౪ సేవింపవలె

౫ రామునియొక్క (ఇష్టదైవముయొక్క)

౧౧౨. మాఁరదించె తనము మాష్యము.

౧౧౩. ద్రౌపది పాతివ్రత్యము తన్మానమును గాచె - (దుశ్శాసనుఁడు చీరలొలువ)

౧౧౪. దేవతాభక్తియుక్త పతిసేవగలది, పరమపతివ్రత.

౧౧౫. దొంగతనముఁ జేయకు - (పట్టుకొన్న, రహస్యముగనైనఁ గొట్టుదురు)

౧౧౬. ధర్మకార్యమును నిర్మలబుద్ధితో నిర్వహింపు.

౧౧౭. ధవుని మించిన దైవము లేదు.

౧౧౮. నయ[1]యుతముగ భాషింపు.

౧౧౯. నాథుననంతరము నారాయణుని భజింపు.

౧౨౦. నియత గృహకార్యముల నిర్వహింపు.

౧౨౧. నియతకాలముల నిజవిభునిఁ జేరు.

౧౨౨. నిందఁ జెందిన సుందరి కంది[2] కుందు[3].

౧౨౩. నిందలేనియింతవదన నెమ్మిఁ[4]జెందు.

౧౨౪. నీతి ఖ్యాతి భీతి బంధుప్రీతి మృదురీతి పాతివ్రత్యంబు ప్రాఁకువందిలి.

---

౧ నీతితోఁడఁగూడి యుండునట్లు.　౨ బాధపడి　౩ దుఃఖించు

# స్త్రీనీతివాక్యములు.

౧

౧౨౫. నెఱుల నిర్నిమిత్తముగ విప్పఁగూడదు.

౨

౧౨౬. పక్వాపక్వములఁ బరిశోధించి తింపు,

౧౨౭. పడఁతి బుద్ధిచాతుర్యములు గలదియైనను, పతికి
౩
నమ్రముగఁ జెప్పవలె- (మతిసంగ్రహముగను.)

౧౨౮. పత్నీభేదము పనికిరానిది- (నీకటులఁ జేసిన సంతోషింతువా-)

౧౨౯. పడఁతికిఁ బాతివ్రత్యము, పాలివట్టిన సొమ్ము.

౪

౧౩౦. పతిభక్తికొఱకుఁ బద్మాక్షుని భజింపు.

౧౩౧. పతిమతిప్రకారముగ మెలఁగు.

౧౩౨. పతి యొకటి చెప్ప, వేఱొకటి చేయకు.

౧ తలవెంట్రుకలు　　౩ అడఁకువతో

౨ పండినది- పండనిది　　౪ నారాయణుని

౧౩౩. పతిసేవ నేమఱని[౧] సతిని వాక్పతియైన[౨] నుతింపలేఁడు.

౧౩౪. పతి, భుజింప భుజింపు- దుఃఖింప దుఃఖింపు- సంతోషింప సంతోషింపు- ప్రోషితుఁడైన[౩], పతిని[౪] త్వ కృశత్వములఁ[౫] జెందు.

౧౩౫. పతిమన్నన కుబ్బకు[౬]. అవమానించిన క్రుక్కకు[౭].

౧౩౬. పతితెచ్చినది కొంచెమైనను గొప్పగ నెంచు.

౧౩౭. పతి కెదుర్మాడినసతి పాపమున కొడిఁగట్టు-

౧౩౮. పతిమాట వినని యతివ బాధలకు లోఁబడు- (ముందందఱు తిట్టుదురు)

౧౩౯. పతిమతిఁ జెందిన సతికి బ్రహ్మయైన భయపడు

౧౪౦. పతియనువర్తనము సతికన్నివ్రతములలో హెచ్చు.

---

౧ మఱువని

౨ బ్రహ్మ

౩ పతియొకయూరికిఁ బోయినవాఁడు.

౪ స్నానము చేసికొనమి

౫ చిక్కి పోవుట

౬ సంతోషింపకు

౭ దుఃఖింపకు

౧౪౧. పతి శయనింపఁ[౧] బాదములొత్తు - (అంగనలు కొరు లున్నఁ బోనీ)

౧౪౨. పతి కిష్టమైన ప్రకారముగాఁ బ్రవర్తింపు.[౨]

౧౪౩. పతి మేల్కొనకమున్న మేల్కొను - (౨౦౯ వ వాక్యమును జూడుము.)

౧౪౪. పతికిఁ బ్రభాతకృత్యములఁ[౩] బ్రాలుమాలక జరుపు.[౪]

౧౪౫. పతి, పరిజనులపైనాగ్రహింపఁ[౫] బడఁగ తచ్ఛాంతిఁ[౬] జేయవలె. (తిన్నని మాటలచే)

౧౪౬. పనులయెడఁ బ్రాలుమాలకు-

౧౪౭. పలుకు పలుకులు, యుక్తములుగా నుండనీ.

౧౪౮. పల్కులఁ జూపుల[౭] వికారము పనికిరాదు.

౧ పరుండ
౨ పండుకొను
౩ తెల్లవార జరుపఁ దగినపనులను.
౪ బాగుచేయక
౫ కోపింప
౬ ఆకోపమును అణఁపవలె
౭ చూపుల

౧౪౯. పతి పిలిచిన నన్యకార్యము నెపమున నాలస్యము చేయక చను.

౧౫౦. పతికి సుఖము లేనియప్పుడతివ సౌఖ్యమును గోరఁదగదు.

౧౫౧. పతిభుక్తశేషమును ౧ బాఱవేయఁగూడదు - (అనిం ౨ ద్యముగ నున్న.)

౧౫౨. పతివ్రతకుఁ గోపము పనికిరాదు.

౧౫౩. పతివ్రత, పతిసహితముగఁ బతితపావనునిఁ ౩ జేరు.

౧౫౪. పతికహితమొనర్చు ౪ వడఁతి భూమికి బరువు.

౧౫౫. పనికేగి మఱలిన పతికిఁ బాద్య ౫ పీఠభోజనంబులిడు.

౧౫౬. పతి యన్యాసక్తుఁ ౬ డైనను, సతి వికృతిఁజెందఁ గూడదు.

౧ తినఁగామిగిలినది అన్నాదికము.
౨ దూషింపఁబడనిదిగా.
౩ భగవంతుని
౪ అనిష్టము
౫ కాళ్లు గడుగుకొన నుదకము.
౬ పరస్త్రీయందాసక్తిగలవాఁ

౧ ౨

౧౫౮. పతిలేనపుడితరపాలకురాండ్రదండఁబండియుండు (అటుగాకున్నఁ బలితులు పాపచింతఁ జేయుదురు.)

౧౫౯. పరానురక్తి పాపమునకు మూలము, నరకము నకు మార్గము.

౩

౧౫౭. పరులతోఁ బల్కవలసినఁ బరుషుఁ గాదు.

౧౬౦. పరపురుషునిపై రతివహించుట పతివ్రతకుఁ దగదు.

౧౬౧. పండ్లు భక్కఁగాఁ దోముకొను.

౧౬౨. పాడిపశువుల పరామర్శ పడఁతుల పని.

౧౬౩. పాత్రములఁ బగులఁగొట్టక, పదిలముగ వాడు- (నిత్యమొక నీళ్లకడవఁ బోఁగొట్టిన రెట్లు-)

౧ అత్త, తోడికోడలు, తల్లి మొదలైనవారు. ౨ దగ్గఱ ౩ గౌరవము

౧౬౪. పానము పరవారికైన బాగుగాదు-

౦ ౧

౧౬౫. పిలువని పేరంటమునకుc బోకు- (పేర్మిచెడు)

౨

౧౬౬. పిల్లలc జక్కcగcదిద్దు-(తీర్పనపుడు-ఎవతె కనె నందురు.)

౩

౧౬౭. పిల్లజాడ పరిగామి తల్లికి మాటc దెచ్చు.

౧౬౮ పిండివంటలc జేయ నేర్చికో- (ఉన్నమట్టుకు చేసికొనవచ్చు)

౧౬౯. పెద్దలుచెప్పినట్టువిను- (వారు నీమేలు గోరువారు గాన)

౪

౧౭౦. పెద్దలతో వాదులాడకు- (గుర్తువచ్చి పిల్లను వెక్కిరించె నందురు.)

౧౭౧. పుట్టినింటనుంటకంటె నత్తింటనుంట చాలమేలు.

౦ నీకు నిమిత్తములేని
౧ గౌరవము (పనికి.
౨ అభాగ్యురాలు
౩ నింద

౪ ఏమియుం దెలియనిది తనకంటెc దెలిసినవారికి బుద్ధిc జెప్పవచ్చెనని నిందింతురు.

౧౭౨. పుత్రులకుఁ జదువుఁ జెప్పింపు. (వేఱెవరును లేకపోయిన.)

౧౭౩. పెదవిదాటి [౧] నవ్వకు.

౧౭౪. పేదలకని యిచ్చినందులో నేదియుం దాఁపకు.

౧౭౫. పురుషుఁడు కోపింప, నతని యనురాగముగా [౨] నొదుఁగు [౩].

౧౭౬. పురాణములన్ని, సతికిఁ బతియే గతియను. (వేఱేలనీకు)

౧౭౭. పైపైయోగ్యత, లోలో నయోగ్యత గల పడఁతుల రోయు [౪].

౧౭౮. పొగచుట్టలఁ బట్టకు. పొగాకు నములకు. (తమలము నధికముగఁ దగదు.)

౧ పకపక వికవిక　　౩ అణఁగియుండు

౨ ప్రియము　　౪ పరికింపు- త్యజింపు

౧౭౯. పాదుగు[౧] దాంతుల[౨] నిడకు- (నిచ్చెనకుఁ బనిలేక)

౧౮౦. బంధు హిత పరిణయాదులకు భర్త్రాజ్ఞతో నే గు- (అధ్యక్షరక్షతో)

౧౮౧. బాంధవుల పరామరిక బాగు.

౧౮౨. భర్తృద్రవ్యమునకు భార్య రక్షకురాలు.

౧౮౩. భర్తకుఁ బ్రతిష్ఠఁ గలిగించునది భార్య.

౧౮౪. భర్త పిలిచినంతనే భార్య పలుకవలయు.

౧౮౫. భర్తృశుభాభివృద్ధి భార్య గోరవలయు-

౧౮౬. భర్త త్రావని పేయము[౩], భుజింపని భోజ్యము[౪], భార్య కగ్రాహ్యము[౫]-

౧౮౭. భర్తయనుమతిలేక బంధువులకేదియు[౬] నీయకు.

---

౧ పెండ్లి మొదలైన వానికి
౨ పెనిమిటియాజ్ఞతో
౩ నీరు మొదలైన త్రాగఁదగినది
౪ అన్నము మొదలైన తినఁదగినది
౫ చెందరానిది
౬ ఏవస్తువును

౧

౧౮౮. భర్తృపరిచర్యయే భార్యకుముఖ్యకృత్యము-(అన్య కార్యము లేవియు దానితో సమానములుగావు)

౧౮౯. భర్తకు సాటి భర్తయే.

౧౯౦ భార్య లెందఱైనను గావచ్చు, భర్త యొకఁడే.

౨

౧౯౧ భార్యానుగుణము భర్త కగణితధనము.

౧౯౨ భార్యాసత్కీర్తి భర్తనంటు - భర్తసత్కీర్తి భార్యకు వచ్చు.

౧౯౩ భార్యాపాపము భర్తనంటు - భర్తృపాపము భార్యనంటదు.

౧౯౪. భార్య, భర్తృసన్నిధానమున నుండవలయు.

౩

౧౯౫ భైక్షవర్తనుల నుపేక్షసేయకు

౧౯౬ మగఁడు పరభార్యానమున నుండ, మగువ తానొకటి చెప్పఁదగదు.

---

౧ సేవయు

౨ లెక్కలేని ధనము

౩ భిక్షముచేత జీవించువాఁడని.

౧౯౭. మగఁడింటికిని యిచ్చిన ధనమును మగువ యుక్త వ్యయమునర్చి శేషము[౧]ను దాఁపవలయు.

౧౯౮. మగనిని దెగడకు[౨] - (అల్పసంపాదకుఁడని)

౧౯౯. మంచిపాటల నేర్చికొను.

౨౦౦. మంచిముగ్గులఁ దీర్చు

౨౦౧. మగఁడులేనిచోట నునికి[౩], మగువకుఁ దగదు.

౨౦౨. మగువ, యొక మంత్రి మగనికి.

౨౦౩ మగనికొఱగామి[౪]ని మగువమాన్పవచ్చు - (పద్మినాగశేఖరునివలె.[౫])

౨౦౪. మగనిని వెగటుగ[౬] మాటాడిన మగువకు నధోలోకప్రాప్తి[౭].

---

౧ మిగిలినది

౨ దూషింపకు

౩ ఉండుట

౪ లోపమును

౫ ఒకసతి, గర్వితుఁడై యతిథిని నాదరింపని భర్తను మంచి మాటలచేఁ జక్కపఱచి యయ్యతిథి నతనిచేతనే సత్కరింపించెను.

౬ అప్రియముగ.

౭ నరకప్రాప్తి

౨౦౫. మగనిమనసు చిన్నఁబోవనియట్టుల మసలు.[1]

౨౦౬. మగఁడెట్టివాఁడైనను,[2] మగువ మనోవాక్క-[3]
ర్మల, పతిని మాననీయునిఁగా[4] నెంచవలె.

౨౦౭. మాటలతేట, అంగవిలాసము, చక్కనిచూడ్కు-
ల-వేఱుచోట మాని విభునియెదుటఁ బ్రకటింపు.

౨౦౮. మానముఁగల సతికిఁ బతియె మహాభూషణము.

౨౦౯. మేల్కొన్నపతియెదుట, కుంకుమధారణతో
మెలఁగు.

౨౧౦. మొగముఁద్రిప్పుట కొఱగామి!

౨౧౧. మోవి విఱుచుటయు నట్టే.

౨౧౨. మృత్యువునకు[5] నిర్దయ, బధిరత్వ మూకత్వము
లుండు.

౧ చింతఁజెందనట్లు. ౨ అంగహీనుఁడైనను, అప్రయోజకుఁడైనను. ౩ తలంపు,మాట, పని వీనిచే ౪ పూజనీయునిఁగా ౫ చావుదేవతకు క్రౌర్యము; చెవుడు, మూగతనములు.

౨౧౩. యాచనకంటెఁ[౧] గష్టజీవనము మేలు.

౨౧౪. యాచనమీఁదఁ జేసినపని చేయకు.[౨]

౨౧౫. రత్నాంగి,[౩] మెన్నికకుఁ దగిన రాణి.

౨౧౬. రూపలావణ్య[౪] విద్యా విభవ
బోటి విభునిమాట దాటఁదగదు.

౨౧౭. లంచముఁ గొనకుము.

౨౧౮. వచ్చినచదువును మఱవకు- వచ్చినధనమును వెఱ
పకు (ఉన్నది పోయిన, బాగా.)

౨౧౯. వృద్ధియాశ, ముద[illegible]చునన్న సామెత
నెఱుఁగవా.

౨౨౦. వంటలో నేమఱకు- (మ[illegible]

౧ వేఁడుకొనుట
౨ సిద్ధించు
౩ రాజరాజనరేంద్రుని పె ద్దభార్య.
౪ పశ్చాద్దనము, వయస్సు.

౨౨౯. సపత్నులఁ[౧] బ్రత్యక్షపరోక్షముల[౨] నిందింపకు.

౨౩౦. సదనోపకరణ సంస్కారణమును[౩] వెదకు.

౨౩౧. సంసారము గుట్టు, వ్యాధి ఆట్టు.

౨౩౨. సవతులలో, మాత్సర్యముగ్ల[౪] గర్వకల భావము లుండఁ గూడదు.

౨౩౩. స్వదుర్గుణము లెంచి, పరదోషములఁ బాటింపు.

౨౩౪. సంయమములు యోగతపస్సులచేఁ బొందుగతి, పతిని భజించు సాధ్వికి- సాధారణముగఁ గలుగు.

౨౩౫. సీతపాతివ్రత్య, మగ్నిని శీతలునిఁజేసి- (అగ్నిప్రవేశసమయమున)

౨౩౬. సీమంతినికి, నింబాసనలాభ మెక్కుడనా-

---

౧ సవతుల

౨ ఎదురను, మఱుఁగునను.

౩ గృహోపకరణములను బాగుపఱుచుటను.

౪ పరులమేలోర్వమి

౨౩౭. సుగుణురాలైన సుదతి, సుపుత్రునిఁ గను.

౨౩౮. సుగుణభార్యఁగల మగనియిల్లు, సుఖాధారముగ నుండు.

౨౩౯. సురకిన్నర గంధర్వాసుర విద్యాధరుల నైనఁ బతియసన్నిధిని జూడకు.

౨౪౦. సంసారమున గృహిణియే సారము, అది లేమి నిస్సారము.

౨౪౧. సకాలస్నానముఁ గావింపు.

౨౪౨. హరిస్మరణ నంతరంగమందుంపు.

౨౪౩. హితాహితముల, యోచింపు.

౨౪౪. హెచ్చుచదు వబలల కెందుకు.

౨౪౫. క్షుద్రదేవతలఁ జూడకు.

స్త్రీనీతివాక్యములు-

ముగిసెను.

---

శ్రీ రస్తు.

---

# సతీహిత సంగ్రహము.

## ప్రథమ భాగము.

## సావిత్ర్యుపాఖ్యానము.

వ|| మునీంద్రా పతిభక్తి తాత్పర్యంబున సకలం లోకంబుల గెలిచి శుభంబు నొందిన పుణ్యసతీచరిత్రంబు వినవలతుం జెప్పవేయని (యుధిష్ఠిరుం డడిగిన) నతనికి మార్కండేయుండు సావిత్రియను రాజపుత్రి చరిత్రంబు దీనిమాది నీ ప్రశ్నంబునకు నుత్తరంబగునని యిట్లనియె||

సీ|| కలఁడు మద్రేశుండు ఘనుఁ డశ్వపతి యను
ధరణీశుఁ డతఁడు సంతాన కాంక్ష । నెంతయు ధృతిఁ
బూనె నెనిమిది యేఁడులు సావిత్రిఁ గొల్చె సజ్జనవిభునకు ।
నద్దేవి ప్రత్యక్షమై వరమడుగుము నావుడు నతఁడు వినమ్రుఁ
డగుచు । నాత్మజుఁ గోరెద ననవుడుఁ గన్నియ పుట్టునీ
కనియె నా భువనమాత । యనుడు దేవి భవత్కృప నస్మ
దీయ । వాంఛితము సఫలంబు గావలె యని నృ । పోత్త
ముఁడు విన్నవింప నయోగ్యమూర్తి । గాఢ కారుణ్య వికచ
హృత్కమల యగుచు ||

వ॥ ఏను నీ మనోరథంబు తెలియంగొన్న చతు
ర్ముఖున కెఱింగించిన నతండును గన్యయగా నిర్దేశించె
నద్దేవుని యానతి యమోఘంబు విను మక్కన్యయ
కారణంబున నీకు నొక్క విధంబునం బిదపఁ బుత్ర శతలా
భంబు సంభవించునని యనుగ్రహించి యద్దేవి యంత
ర్ధానంబు నొందె నయ్యశ్వపతియును సావిత్రీ ప్రసాదం
బున నిజ పత్నియైన మాలవియందు సావిత్రియను కూఁ
తుంగని యక్కన్నియ నతి గౌరవంబునం బెనిచె నంత ॥

క ॥ ఆవనజాక్షి పరిస్ఫుట । యౌవనయై సిద్ధ
సాధ్య యక్షామరక। న్యావలిఁ దన సౌందర్య। శ్రీవిలసన
రేఖ నపహసించుచునుండెన్ ॥

తే-గీ ॥ కోరి జనపతి దన పుత్త్రికూఁతుఁ జూచి ।
గుణవయోరూపముల ననుకూలుఁడైన ।. భర్త నెమ్మయి
దీనికిఁ బడయువాఁడ । నొక్కొ యని యొందుఁ దడవుచు
నుండె నెలమి॥

వ ॥ అదియును సాళ్వపతియైన ద్యుమత్సేనుకొడుకు
సత్యవంతుండు రూపవంతుండనియును గుణవంతుండని
యును విని వానియందుఁ జిత్తంబు దగిలియున్నను సిగ్గు
పెంపున నెవ్వరికిఁ దెలియింపకుండె నంత నొక్కనాఁడు
మహీపతికడకు నారదుం డరుగుదెంచిన నతం డమ్మహా

ముని నుచిత సపర్యావిధులం బరితోషితుం జేసి సద్గోష్ఠి విశేషంబులు సలుపుచున్నయెడ ||

క || నెచ్చెలులు దన్నుఁగొలువఁగఁ। బచ్చవిలుతు కలిమి యెల్లఁ బద్మాననయై। యచ్చపడినట్లు మెఱయుచు। నచ్చటికేతెంచె భూవరాత్మజ నెమ్మిన్ ||

వ || ఇట్లువచ్చి సఖీజనంబుల నంతంతనిలిపి మెలపు తోడి పొలుపున నమ్మగువ లీలామధురంబుగఁ దండ్రికి దండప్రణామంబు సేసిన నతండు ప్రగాఢ స్నేహ సన్నాహ బోహలంబగు చిత్తంబుతో నత్తన్విం గ్రుచ్చియెత్తి నిజాంకతలంబున నునిచికొని సముచితోపలాలన కేళీపరవశుం డయ్యె నప్పుడు నారదుం డమ్ముగ్ధియం జూచి యశ్వపతి తోడ నిక్కన్నియం దగిన వరున కొసంగక యిట్లేల యునిచినవాఁడ వనిన నతండు కూఁతున కిట్లనియె ||

తే - గీ || తల్లి నీగుణరూప వృత్తముల కెంతుఁ। దగిన వరు నీవ యెఱ్ఱుంగఁ దడవి నెమ్మి। నీదు మనసున కెక్కిన నృపకుమారుఁ। గోరి వరియింపు మిదియ నాకును బ్రియంబు ||

వ || అనిన నదియును గొండొక లజ్జించి కోర్కె మొఱంపున నీక్షుఁ దలంగం ద్రోఁచి ప్రకట కౌతూహల తరళితాంతరంగ యగుచుఁ దండ్రికిట్లనియె ||

క || చిరకీర్తి సాళ్వభూవరు। వరతనయుండైన

సత్యవంతుండు నాకున్| వరుండుగఁ గోరెద మదిలో| నర
వర యాతనికి నిమ్ము ననుఁ బ్రీతిమెయిన్ ||

వ || సావిత్రియును నిపుడు దైవయోగంబునం జేసి గతచక్షుండై తనరాజ్యంబు వైరులచేతం గోలుపడి పుత్రదార సహితంబుగ వనంబున నున్నవాఁ డెక్కెన, సత్యవంతు వరియింతు ననిన మద్రేశ్వరుండు నారదుం జూచి మునీంద్రా మీయట్టుంగనివారు లేరు సావిత్రిచేత వరియింపంబడిన కుమారుం డెట్టివాఁడు వాని గుణరూప శీలంబు లెఱింగింపుఁ డనిన నారదుం డిట్లనియె ||

సీ || సత్యంబె పలుకుట సత్యవంతుం డన నతఁ
డొప్పు మఱియుఁ జిత్రాశ్వుఁ డనఁగ | నాయూంబరంబు
సన్నరనాథ సుతుసమఁ గలదు తేజంబునఁ గమలమిత్రు |
బుద్ధి నింద్రాచార్యు బగడించు శూరత వాసవుఁ దాల్మి
వసుధఁ బోలుఁ | గాంతిఁ జంద్రుని కైన గాఁదగు రూపున
నాశ్వినేయుల సరియనఁ జెల్లుఁ | దపము శమము దమము
దానంబు బ్రాహ్మణు | క్షత్రియును మహాప్రభావతేయును |
సతనియందకాని యన్యులయందు లే | దింతనిక్కువము
మహితలేశా ||

వ || వానియందును గీడొక్కటి గలదు వరిణయంబు మొదలుగా నొక్క సంవత్సరంబునకు మృతిఁబొందు నది నీకుఁ జెప్పవలయుటంజేసి చెప్పితి ననిన నతండు గూఁతు

మొగంబు సూచి తన్వీ యిమ్మహాత్ముండు దేవ రహస్యం బెఱుంగు నీయనపచనం బమోఘంబు నీకు నట్టి వరుం డేల నొండొక్కవరుని వెతకికొమ్మనిన నక్కన్యక యిట్లనియె ॥

క ॥ వినుము మనోవాక్కాయము । లనుమూఁ
డు దెఱంగులందు సంతతఃకరణం । బనఘ ప్రధానము గా
వున । మనమునఁ గైకొన్న భర్త మానందగునే ॥

వ ॥ సత్యవంతుం డెట్టివాఁడైనను నగుంగాని మేనికఁ నొరుల వరియింప నొల్లననిన నశ్వపతి నారదు దెసఁ జూచుటయు నతండిట్లనియె ॥

చ ॥ గొనయులప్రోగునీయనుంగు కూఁతురు దీని
తలంపు మాన్పఁగా । మనకు నశక్యమింక ననుమానము
వేల నరేంద్ర యింతిఁజ । య్యాన నృపసూతికిమ్ము కమలా
సన చేసిన పుణ్యగౌరవం । బున నయినం బ్రియుండు పరి
పూర్ణ చిరాయురుపేతుఁ డయ్యెడున్ ॥

వ ॥ అనిన నమ్మహీపతి మునిపతికి మ్రొక్కి నీవు మాకుం బరమగురుండవు మీ యానతిచ్చినట్లు చేసెద ననిన నారదుండు వారి దీవించి దివంబునకుం జనియె నంత ॥

సీ॥ అమరఁ బుణ్యదినంబునందు బాంధవ మంత్రి
వృద్ధ పురోహిత వితతితోడ । సావిత్రిఁదోడ్కొని జననాయ
కుండు వైవాహిక మహనీయ వస్తుకోటిఁ । గొనుచుఁ బు

క్యారణ్య గోచరుఁడై తపస్వ్యతుఁడైన యా ద్యుమత్సేను కడకు । చనిన నారాజును సంభ్రమంబున నశ్వపతికి నర్ఘ్యాది సంభావనంబు । లాచరించి సముచి తాభిమతా లాప । పూర్వకముగ సుజనపూజ్యుఁ డతని । యాగమన నిమిత్త మడిగిన మద్రేశుఁ । డెలమి సాళ్వపతికి నిట్టు లనియె ॥

క ॥ ఈకన్నియ నాకూఁతురు । మాకులమున కెల్లఁ దెప్పమనుజోత్తమ నీ । కీకన్నియఁ గోడలిఁగాఁ । గైకొను ము మదీయవచన గౌరవబుద్ధిన్ ॥

వ ॥ అని పలికి సావిత్రి నతనికి నభివందనంబు సేయించి మఱియు నతండు ॥

క ॥ నీకొడుకు సత్యవంతున । కీకన్నియ దగు నరేంద్ర యీకన్నియకున్ । నీకొడుకు తగు ననన్యగు । ణాకరు లియ్యిరువురును సమంచితమూర్తుల్ ॥

వ ॥ అనిన నతనికి ద్యుమత్సేనుం డిట్లనియె ॥

తే- గీ ॥ విగతరాజ్యులమై ఘోరవిపినములకు । వచ్చి యిమ్మాయిఁ దపమున్నవారమేము । బాల సుకు మారి యిది జనపాల యడవి । నుండి మాతోడి యిడుమల కోర్చునయ్య ॥

వ ॥ అనిన నశ్వపతి యతని కిట్లనియె ॥

ఉ॥ కలిమియు లేమియున్ సతతము గావవి వెం
దినచోఁ దెలంగుచున్ । గలఁగుచునున్కి ధీరుల ప్రకార
ము చెప్పగ నింతవట్టునేఁ । దెలియుదుఁ జెప్పెద న్వినుమ
తీవర విన్నయనంగనేల యే। కొలఁదియుఁగాదు ధీరమతి
మూఁడురు పేర్కొనఁజాలుఁ జెంపునన్ ॥

క॥ నీతోడ వియ్యమందం । జేతోగతి నాసఁజేసి
చెచ్చెర నీసిల్లి। నైతెంచితి మత్ప్రార్థన । బ్రాఁతిగఁ జేకొనక
యునికి పాడియె నీకున్ ॥

వ॥ అనుటయు నయ్యంధనృపతి తత్సంబంధము
నకు సంతసిల్లి నిజాశ్రమవాసులైన మునులం గూర్చికొని
శుభలగ్నంబున సత్యవంతునకు. సావిత్రిం బరిణయంబు
సేసె నయ్యశ్వపతియునుం గూఁతునకు నల్లునకు వివి
ధాంబరాభరణాది వస్తువు లొసంగి నిజపురంబున కరిగెఁ
బదంపడి ॥

తే-గీ॥ పడఁతి రమణీయ భూషణాంబరవిలాస ।
ముజ్జగించి వనాంతరయోగ్యలీల । వల్కలాజినవసనయై
బడల కధిక । భక్తి భర్తృశుశ్రూషణ పరత నుండె॥

క॥ ఆపెఁతత నేయు సువినయ । సామగ్రుల
మృదుగభీర సంభాషణలన్। మామయు నత్తయు సంతో।
షామృతమునఁ దేలి రంతరంగములఁ దగన్ ॥

వ॥ సావిత్రియుఁ దనమగని యాయుఃప్రమా

ణంబు నారదముని చెప్పిన దినంబు మొదలుగా ననుదినంబును లెక్క యిడికొనుచు నిట్లు వర్తిల్లుచుండ నాలుగు దివసంబులు గొఱంతగా నొక్క సంవత్సరంబు గడచిన॥

క॥ నాలవదినంబు పతిమృతి। కాలంబని మది
నెఱంగి కడునిష్ఠమెయిన్। జాలం భరంబుగాఁ బూనెను।
బాల త్రిరాత్రోపవాస పరమవ్రతమున్॥

వ॥ దానికి విస్మయంబంది ద్యుమత్సేనుండు కోడలిం బిలిచి తల్లీ యిట్లుల దుస్తరంబగు వ్రతంబుఁ దొడఁగితి వనిన నమ్మద్రరాజనందన వినయంబులో నిట్లనియె॥

క॥ మీరు మదీయంబగువ్రత। భారమునకు వగ
వలదు పరమశుభంబుల్। గోరి వ్రత మిది బూనితిఁ। గార
ణమును మీ కెఱుంగఁ గానగుఁ బిదపన్॥

వ॥ అనిన నతండట్లైన మేలుగాకయనియె నంతఁ జతుర్థదివసంబున॥

సీ॥ కడు రేపకడన మేల్కని నిజభర్తకు మరణ
దినంబని మానసమునఁ। దద్దయు శోక సంతాపంబు గదు
రంగ దినముఖోచితవిధుల్ దీర్చి భక్తిఁ। బతికి సముచిత
పావనపరిచర్య యప్పుడు శుశ్రూష యాచరించి। అత్త
మామలకును నచటి వృద్ధులకును వేర్వేర ప్రణమిల్లి వేడ్క
వారు। తనకు సౌభాగ్య మధికవర్ధనము గాఁగ। నిచ్చు

దీవెన మదిలో గ్రహించి యుండఁ । బ్రొద్దుజామెక్కుట
యుఁ బూవుబోణిఁ బిలిచి । మామ యిట్లనిపలికె సన్మాన
మొసఁగ ॥

క ॥ కడు నుగ్రంబగు వ్రతమిది । వాడఁగ రతి దివ
సత్రయంబులో నది సెల్లెఁ । బడఁతీ యెంతయు డస్సితి ।
తడయక పారణ మొనర్పఁ దగదే యింకన్ ॥

వ ॥ అనిన సావిత్రి యతని కిట్లనియె ॥

ఆ- వె ॥ అధిప ప్రొద్దు గ్రుంకు నంతకు నేడును ।
గుడువఁ దగదు నాకుఁ గోరి యిట్లు । గాఁగ వ్రతముఁ
బూనుకాలంబు నన నేను । నిశ్చయించుకొనిన నియమ
మిదియు ॥

వ ॥ అనియె నవ్వుడు సత్యవంతుండు సమిత్కుశ
ఫలాహరణార్థంబు వనంబునకుఁ గదలినం జూచి సావిత్రి
చేరంజని వనంబునకు నీతోడఁ జనుదెంతుఁ దోడ్కొని
పోవలయు ననిన నతండు నీవు త్రిరాత్రోపవాసంబునం
జేసి యెంతయు డస్సినదానవు రానోపవనిన నత్తన్వి
యతని కిట్లనియె ॥

మ ॥ ఉపవాసశ్రమ మించుకేనియును నాయు
ల్లంబునం దోఁచదు । విపినం బుజ్జ్వల పుష్పపల్లవ ఫలా
విర్భూత నానాలతా । గవరితంబని వింటిఁ జూడఁగ మదిం

గాఢమోహంబు బొమ్మిన స్నేహబోధింపక నింతపట్టు వనుభి
యుక్తుండ వెబ్బంగులకా ॥

వ॥ అనంతం దట్లు గాకయని రమ్మనుటయు సావిత్రి చయ్యనం జని భార్యాసహితుండై యున్న రాముకుం బ్రణమిల్లి మీకొడుకు వనంబునకు నగ్నిహోత్రార్థంబై సమిధలు దేర నరిగెడు నాకును నతనితోడం జని వనంబుం జూచుటకు వేడ్క యయ్యెడు మీరు నాకిప్పు డనుజ్ఞ సేయ వలయునని నతం దిట్లనుచు నెన్నండును నెయ్యదియును నడుగ దిత్తెఱంగు దీనికిం బ్రియంబై యున్నది నాకు నివారింపనేలయని తలంచి యనుమతించుటయు నయ్యిరువుర యడుగులం బడి వీడ్కొని॥

క॥ చిత్తంబును పైకొనియెడు। నుత్తలము నడంచి
ముఖపయోరుహమున ద। ళ్ళొత్తెడు జిడ నశ్రువనం
బ్రియు। చిత్తం బిగుకొత్తం జనియెం జెలువ యడవికిన్॥

వ॥ ఇట్లా దంపతులు మందగమనంబునం బరిసరారణ్యంబు దరియం జొచ్చి రప్పుడు॥

సీ॥ కమనీయ కమలినీ కల్లోల వీథులం గదలురా
యంచల గతులమొప్పు। బహు పుష్ప పల్లవ ప్రకర చిత్రి
తములై తనరారు తరులతాతతులసొంపు। మకరంద
రస పాన మదవిలోలంబులై క్రాలెడి తుమ్మెదతేటి గముల

యములివ్వఁ। బరిపక్వ మంజుల ఫలరసోద్ధతము నై పలుకు రా
చిల్కల పటురవంబుఁ। బ్రియుఁడు వేరువేర బ్రీతిఁ
జూపుచుఁ। జెప్పుచును జనంగఁ జిగురుబోఁడి। కనుచు
వినుచు నిర్వికార సల్లాప మిం। పార సతని తెఱఁగు
నరయుచుండె॥

వ॥ తదనంతరంబ యా రాజనందనుండు మధు
రంబులగు ఫలంబులఁ గోయుచు నవి గంపయ నించి
యొక్కయెడఁ బరశుపాతంబునం గాష్ఠదళనంబు సేయం
దొడంగి శ్రమంబున నొల్లంబోయి గొడ్డలి పుడమి వైచి
నిరంతర నిశ్వాసవేగ విషణ్ణ వదనుండగుచు సావిత్రిం
గనుంగొని॥

చ॥ ఒడలు వశంబుగాదు భ్రమ నొందినయట్లు
మనంబు దూలెడున్। గడఁగి శిరంబు శూల విశిఖ ప్రక
రంబుల నొంచినట్ల వ్యధ। నొవ్వెడు నిలువంగ నోర్వ నొక
యించుక సేపు శ్రమంబు దీఱనీ। పుడమి శయనింతు
నాఁడు నీ తేషుఁగ నొత్తని సంభ్రమంబుతోన్॥

క॥ తనయంకతలము ప్రియశిర। మున నుపధా
నముగఁ జేయ భూపతనయుఁడో। య్యన వ్రాలి సోలి
నిశ్చ। తనుఁదైనట్లుండెఁ గొంతదడవున కెదురన్॥

మ॥ కనియెన్ గోమలి నీలమేఘు విలసత్కాలాం

జనాకారు ఘో। ర నిశాతోత్కట దంష్ట్రు నుజ్జ్వలదల
ద్రక్తాక్షు ప్రత్యగ్రకాం। ఘన వర్ణాంబరు నంత్యకాల
దహన జ్వాలా ప్రచండుఁ జగ। ద్జన సంత్రాసకు
నుగ్ర విభుఁ బటుపాశ ప్రాంత హస్తార్థకుఁ ||

వ॥ అప్పురుషుండును నధిక సంరంభంబున సత్యవంతుం గదిసిన నయ్యింతి యుంతయు భయంబునం బ్రియునితరం బొయ్యన దిగువం బెట్టి నిల్చి కృతాంజలియై యయ్యా నీ వెవ్వ రిచ్చ్యోడకు నెయ్యది సేయం దలంచి విజయంచేసితి వనిన నతండిట్లనియె॥

సీ॥ కాలుండఁ జావ్వో యేఁ గమలాక్షి నను నీవు
మహిత పాతివ్రత్య మహిమఁ జేసి। కానంగఁ జాలితి కాన
రాదన్యుల కిది నీదు భర్తకు నిపుడు కాల। ముగుటయు
వీఁడు మహాపుణ్యనిధి గాన నితరులఁ బనుపక యేను వీనిఁ।
బ్రత్యక్షఁ గొనిపోవఁగాఁ జనుదెంచితి నని యుగ్రభంగి
నయ్యంతకుండు। ధరణీనాథతనయు తనువునఁ బ్రాదేశ।
పరిమితాత్ముఁడగుచుఁ బ్రజ్వరిల్లు। జీవు వెడలఁ దిగిచి
కెచ్చెర నతిదీర్ఘ। భయదపాశనికర బద్ధుఁ జేసి॥

మ॥ కాని వేగంబున దక్షిణాభిముఖుఁడై ఘోరం
బగు మార్గంబునఁ బోవఁగాఁ గాంచి యనంతరంబ సుదతిన్
సావిత్రి శోకంబు నై। కానఁ బ్రాణేశ్వరుతోడ మృత్యు—

యుడ సంగుప్తంబుఁ గావించి యూ । తని పజ్జందగఁ
దాను నేగెఁ బదపద్మంబు ల్వారిం బొట్రిలకా ॥

ఆ - వె ॥ దానిఁ జూచి దండధరుఁడు నీవిక్లేల ।
వచ్చెదవు లతాంగి వలదు నిలువు । మింతి నీకగమ్య మిట
ద్మందు తెరువెల్ల । ననిన నతని కిట్లు లనియెఁ బొలఁతి ॥

క ॥ వరు లెందుఁ జనిన నచటికి । సతులకుఁ జన
వలదె నీ ప్రసాదంబున ను। త్పతి భక్తి కతమునను సం।
స్తుతగుణ నాకరుగరాని చోటులు గలవే ॥

వ ॥ సకల మార్గంబులందును ధర్మమార్గంబు
ప్రధానం బట్టి ధర్మంబునకు నాధారంబు సజ్జనులయని
వినంబడు నట్టి సజ్జన సందర్శనం బెప్పుడును వృథగాదు
గావున సజ్జనశేఖరుండ వనంజను నీదైన సందర్శనంబునం
బరమ శుభంబు నొందకయేను రిక్తజనంబుల తెలంగున
నూరక యొట్లు మగుడుదు ననిన దాని ప్రగల్భ వచనంబు
లకు సద్భుతంబంది ధర్ముం డిట్లనియె ॥

ఆ - వె ॥ తేజులతాంగి భవదుదార వాక్యంగికి ।
మెచ్చువచ్చె నాత్మ నిచ్చువాఁడ। వేఁడు మొక్క వరము
విభుని జీవిత మొక్క । టియును దక్క నేది యయిన
నొందు ॥

చ॥ అనవుడు మద్రరాజసుత ప్రాంజలియై సవి
త్రితోడ నిట్లను రిపుకోటిచే నపజయంబును బొందిన వ
నాంతరంబునం దనవరత వ్రతాశ్రితుండైన మహాత్ముం
డు సాళ్వభూవిభుం డనఘుండు లబ్ధచక్షుండగు నట్టు
లుగాం గరుణింపవే మదిన్ ॥

క॥ నాథుడు నట్టుల యయ్యెడు। నీవిట రావలదు
దుడుగు నెమ్మినని వెసం। బోవందొడంగెను బితృపతి।
యూవెలందియు నంత నిలువ కరిగెం బిఱుందన్ ॥

వ॥ ఇట్లు చని చని మఱియు నిట్లనియె ॥

చ॥ ఎడపక వాఙ్మనఃక్రియల నేరికిం హింస
యొనర్పం బూనరే। యొడలను దీనులం గరుణ యేర్పడం
బ్రోతురై చూతు రిచ్చుచోం। గడుపడంగ నీకెదిరి శాం
తీశతము ల్బుధిమట్ట దీర్తురె। దుక్కడు మదిం గూర్తు రా
శ్రితులకు న్వాను మన్నియు నార్య ధర్మములే॥

క॥ నీవెఱుంగని యది యెయ్యది। దేవోత్తమ
ధర్మగతుల తెఱంగెల్ల భవ। ద్భావాధీన ముగుటం గా। దే
వలనిని నీవు ధర్మదేవత యనంగాన్ ॥

క॥ సమబుద్ధితోడం బ్రవ। ర్తనముచిత కర్మఫల
ముఖిల జంతుతతులకున్। సమవూర్చుట నీకయ్యెను। సమ
వర్తి యనంగం బేరు జగదభిమతమై॥

క॥ యముఁడం త్రదు నిన్ను నార్యులు। యమియింపుదు ఘాతతతుల నట్లగుటఁ దగన్। శమనుండవై రి కల్మష। శమనంబునఁ జేసి నీవు జలజాక్షసుతా॥

వ॥ అనినం బ్రేతపతి యా పుణ్యసతి కిట్లనియె॥

క॥ తృషితుఁ డగువాని శీతల। తుషార తోయములఁ బోదితునిఁ జేయఁగలిన్। హృషితాంగుఁ జేసెననుఁగ। ల్మష రహితము లైన నీ సమంజస ఫణితుల్॥

వ॥ కావున సత్యవంతు ప్రాణంబు దక్కం దక్కిన కోర్కె యెయ్యదియైనం జెప్పుము సఫలంబు సేసెద ననిన సావిత్రి దేవా వైరులచేత నపహృతంబైన రాజ్యం బెప్పటియట్లు ద్యుమత్సేనుం బ్రాపించునట్లుగా ననుగ్రహింపవేయని వేఁడుటయు వైవస్వతుం డట్లయగు నని పలికి యిట్లనియె॥

ఆ - వె॥ వలవదుడుగు మింక వదలక నీభక్తి। మగని వెంట దుర్గమంపుఁ ద్రోవ। యిది కృతంబులయ్యె నెల్లవియును నిట్లు। వచ్చు నెలవు లేదు వనజవదన॥

వ॥ అనిన నమ్మహాభాగ యతని కిట్లనియె॥

క॥ ధర్మాత్ములు దమసలిపెదు। ధర్మక్రియఁ దప్ప రెట్టి దశలందును మా। హాత్ములుఁ దాపముఁ బుట్టిన। ధార్మిక హృదయములఁ బ్రబల ధర్మాధ్యక్షా॥

పమోహమయస్తై యిది శర్వరీముఖం । బొదవె విపింబనం
ఓపట సెప్పదు లెస్స్ నరేంద్రనందనా॥

మ ॥ అదె నక్తంచరు లింద నందును మహో
గ్రాకారులై క్రందుగా । మెదలం జొచ్చిరి ఘోరఫేర
వరుతుల్ మిన్నంటెఁ దీవ్రంబులై । పదశబ్దంబులు మీటెఁ
జూడు గలయం బాలం బొడంగెం బెనుం । గదుపుల్గట్టి
మృగంబు లెంతయు భయోత్కంపంబు నాకయ్యెడిన్॥

క ॥ విను నీవు దడయుటకు మీ । జననియు జన
కుండు గరము సంతాపభరం । బును బొందుదు రింతకుఁ
గ్రి । న్నన వెసఁ జని సంతసం బొనర్పవె యధిపా॥

వ ॥ అని పలికి తదీయ విషాద విచేష్టితంబు లుప
లక్షించి వెండియు ॥

చ॥తమమును జెల్లఁగాఁ బరఁగె దట్టు నిజాశ్రమ
భూమియు నేర్పదిన్। శ్రమమును బాయ దివ్వదమ ఛంద
మునైనఁ జనంగనేల యిం । పమరఁగ నింతప్రొద్దు గుఱు
గాకర యిచ్చట నిల్చి రేపు పో । దము తెలఁగెత్తి నావు
డును దన్విక సాత్వతనూజుఁ డిట్లనున్ ॥

క ॥ మూని శిరోవేదన నా । మెనికిఁ దగ లావు
తప్పె మిల్లనై జరుగం। గా నేర్తుఁ దల్లిదండ్రులఁ। గానక
యిట్టు నిలుతుఁ గావననియున్ ॥

క॥ఇంతకు మున్నెన్నఁడు నే। నింత దడవు వారిఁ-

క॥ నావార్త వినక యింతకు । నావృద్ధులు కన్న
హృదయులై ప్రాణంబుల్ । పోవిడుతురు గాక చటికిఁ।
పోవం బని గలదె, యేను బుచ్చెద నసువుల్ ॥

వ॥ అని బహుప్రకారంబుల విలపించి కన్నీరు నించిన నక్కాంత దుఃఖాక్రాంతయగుచు నతని నాశ్వాసించి నవ మృణాళ మృదులంబగు భుజంబులం గౌఁగిలించి మొగయనెత్తిన మెత్తన లేచి యతండు ధూసరితంబైన శరీరంబుం దుడిచికొని గమనంబునకు నుత్సహించిన॥

క॥ ఫలభారము దుర్భరమని। వెలఁది యచట నొక్క వృక్ష విటపంబున ని। ల్కుముల గరిడియఁ దగిలించి యు। త్ఫలపరశువుఁ గొనుచు మృదుల సంభ్రమురాలిఁగా॥

వ॥ జీవితేశ్వరు వామబాహువు నిజ వామభుజంబునై నిడికొని దక్షిణహస్తంబున నతనిఁ గ్రుచ్చి కౌఁగిలించి మందగమనంబున నాశ్రమదేశంబునకు మగిడె నంత నక్కడ

ఉ॥ కన్నులు వచ్చి ముసలిదలు గన్గొని వృద్ధనరేంద్రుఁ డాత్మసం। గన్నులఁబోలె నైన తన గాదిలి పుత్రుఁడు గాననంబులో। నెన్నఁడు లేని యింత తడవేటికిఁ జిక్కె నొయంచు నార్తితోఁ। గన్నులు లేని యట్లతఁడు గానక యేడ్చె సతీ సమేతుఁడై॥

తరల॥ కొడుకు నిందును నంద రోయుచుఁ గో

ప్రేమ భరంబునం। గొడుకు సద్గుణ కోటు లెల్లను గొంటి
భంగుల నోలి ను। గ్గడన సేయుచు సత్యవంతునిఁ గానరే
మునులార యీ । యడవి లోపల నంచు హా సుత
యంచు దైర్యము డించుచున్॥

వ॥ ఉన్నంతఁ దదాశ్రమవాసులైన మునులందఱు నతనిఁ బొదివికొని తదీయ నయన లాభంబునకు విస్మయం బందుచు నుచిత వాక్యంబుల నతని నాశ్వాసించుచుండిరి తదనంతరంబ యొక్క ముహూర్తంబునకు సావిత్రీ సహితుండై చిత్రాశ్వుండు చనుదెంచిన నావృద్ధదంపతు లత్యంత హర్షంబున నతనిం గౌఁగిలించుకొని మూర్ధాఘ్రాణంబు సేసిరి మునులు సంతసిల్లి రప్పుడా రాజర్షిముఖ్యుండు పుత్రునిం జూచి యయ్యా యిన్నేల దడసితివని యడిగిన నతండును దానుం జని పండ్లుగోయుటయును గాష్ఠ దళనంబు సేయుచోడం దలయొదు గదిరి నిలువనోపక విశ్రమించుటయుఁ దన్నొక్క పురుషుండు కలలోన నిగ్రహించుటం జెప్పనైడ సావిత్రి మామ కిట్లనియె॥

సీ॥ ఈ రాజపుత్రున కీదినంబున మరణం బని
మును చెప్పె నారదుండు। మునినాథువదనం బమోఘంబు
గాఁగాన నేమును కేను నేడిదినితోడ। నడవికి నేగితి నటవి
నీతఁడు సుప్తుఁడైయున్నయెడ వచ్చె నంతకుండు। వచ్చి
యిత్యాత్ముని ఁగొనుచుఁగొని పోవంగ వెనుకొని భవ మును ముని

ధర్మాంగి। సత్య ధర్మ ఖ్యాతి సంస్తుతింపఁబడుఁ గృ। పార్ద్ర
చిత్తుఁడగుచు నజ్జనకుండు। నాకు నెమ్మి నొసఁగె నాలుగు
వరములం। దొకట నితఁడు జీవయుక్తుఁడయ్యె ॥

వ॥ మఱియు నొక్క వరంబు భవదీయ నయనో
న్మేష కారణంబయ్యెఁ దక్కిన వరద్వయంబునను మీకు
వైరిహృత రాజ్యంబు సంప్రాప్తియు మదీయ జనకునకుఁ
బుత్రశతలబ్ధియు నగునని చెప్పిన నయ్యిద్దఱుఁ బరమా
నంద కంటకిత హృదయులై కోడలి కిట్లనిరి॥

క॥ ఆపత్సముద్ర మగ్నం। బై పోయెడు నస్మద
న్వయము వెంపెసఁగఁగా। దేపవయి కడపఁబెట్టిన। నీపు
ణ్యచరిత్ర కీర్తనీయవగు తల్లీ ॥

వ॥ అని యభినందించి రప్పుడు మునివరులందఱుఁ
బ్రశంసావచనంబుల నుపలాలించి వారల దీవించి నిజ
గృహంబులకుఁ జని రంతఁ గతిపయ దినంబులకు॥

సీ॥ ఆసాళ్వభూపతి యాప్త మంత్రులు మూల
భృత్యులు పౌరులు పృథివిఁ గలుగు। పెద్దలు గూడి సంప్రీతి
నాతని పాలి కేతెంచి వినయ సమేతు లగుచు। నవనీశ
నీశత్రుఁ డాత్మీయ భృత్యభేదంబునఁ జేసి బాంధవసహాయ।
సహితుఁడై మృతిఁబొందె సకల జనంబులు నేకచిత్తంబున
నిపుడు నిన్నుఁ। బ్రకట రాజ్య పదవిఁ బట్టంబుఁ గట్టంగ।
వచ్చినారు నిఖిల వసుధయందు। విస్తరిల్లె నీదు విజయ
ఘోషము భద్ర। గజము నెక్కి వేగఁ గదలు మింక॥

క ॥ ప్రాకట తపోబలంబున । నాకఠిర బలంబ
నుండ నైయున్న నినుఁగా । లోకేశ చూడఁ గంటిమి మా
కన్నులు ధన్యనయ్యె మాభాగ్యమునఁగా ॥

వ ॥ అనినం బ్రహ్మాది హృదయంగమై ద్యుమత్సే
నుండు నత్యుగంబ తదాశ్రమవాసులైన మునుల నభి
నందించుచుఁ గొడుకునుం దానును గజారూఢులై బహుళ
చతురంగ సేనాసంకుల గమనంబునం బురంబునకుం జని
సకల మహీరాజ్యంబునుం జైకొని చిత్రాశ్వునకుఁ శ్రీ
యువరాజ్య పట్టం బొసంగి పరమైశ్వర్య ధుర్యుం డయ్యె
నిత్తెఱంగున ॥

క ॥ తన మగని సత్త్వ మామలఁ । జననీ జనకులను
దమ్ము సకలంబును దా । ఘనముగ సముద్ధరించెను । జన
వర సావిత్రి పుణ్య చరితముఁ గంటే ॥

తే - గీ ॥ అపతివ్రత యట్టి యీ యాజ్ఞసేని ।
పరమకళ్యాణ కర్మ సంభావనీయ । యధిప మిమ్ము మీయ
ఖిలాన్వయంబు । ముగుద నుద్ధరించు మహాభాగ్యయుక్తిఁ
జేసి ॥

క ॥ అనిచెప్పి పాండుతనయుల । ననఘుఁడు
వీడ్కొని మునీంద్రుఁ డనుపమ తేజో । ఘనుఁడగు
మార్కండేయుఁడు । దనయాశ్రమమునకు నరిగెఁ దక్ష

డను బ్రాహ్మణుండు ధర్మతత్పరుండు సంతతాధ్యయన తత్పరుండై యొక్క స్వగ్రామంబున నుండు నతం డొక్కనాఁడు గ్రామసమీపంబునం దొక్క వృక్షమూలంబున నాసీనుండై వేదంబులు గుణియించుచుండఁ బదియ శాఖాగతంబైన కొక్కెర యతనిపై రెట్టవైచిన నమ్మహాద్విజుం డలిగి చూచుటయు నది యప్పుడ నిశ్చేతనంబై నేలంబడినం గనుంగొని యతండు ॥

క ॥ అక్కట నాహృదయమున గదు । నక్కటి
కము లేనిదయ్యె ననిమిత్తము గా । కొక్కెర నిటు చే
సితి నా । కెక్కడి శాంతియని వికల హృదయుండా
గుచుఁ ॥

వ ॥ తక్కుధంగుల వగచి మధ్యాహ్నం బగుటయుఁ గృతస్నాన విధానుండై గ్రామంబున కరిగి యందు శుచులైన విప్ర గృహంబుల కరిగి భిక్షాచరణంబు సేయుచు నొక్క పుణ్య గృహంబు వాకిట నిలిచి భిక్షాందేహి యనుటయు నాయింటి సతియు నతి సంభ్రమంబున భిక్ష యిడుటకుం బాత్ర శోధనంబు సేయునెడ॥

ఉ॥ ఆ కులనాగ భర్త గడు నాఁకటఁ దూలుచు
వచ్చె వచ్చినన్ । దోయజనేత్ర సంభ్రమముతోఁ దగు

పీఠముఁ బెట్టి పాద్యముం । బాయక మజ్జన క్రియయు
భక్తి నొనర్చి ప్రియోక్తులొప్పఁగా। నాయనఁ దృప్తుఁజేసె
రుచిరాన్న రసంబున నింతి చెచ్చెరన్ ॥

ఉ ॥ కుడిచిన పిమ్మటం గుసుమ కోమలి విస్తృత
సంస్తరంబు గా । నొడికపు శయ్యసేసి ప్రియుఁ డా
య్యన నంచు శయింపఁ దమ్ములం। బిడి చరణంబులొత్తి
మది రేఁగుణ యంతటిలోఁ దలంచె ము । న్నడరఁగ భిక్షు
వై నిలిచినట్టి మహీసుర ముఖ్యు నాత్మలోన్ ॥

వ ॥ ఇట్లు దలంచి భిక్షుఁగొనుచుం జనుదెంచిన
నమ్మగువం జూచి కౌశికుండు రోషరంజిత లోచనుండ
గుచు నిట్లనియె ॥

క ॥ అడిగిన యప్పుడ చెచ్చెరఁ । గడపినఁ బోస
వ్వ యేను గదు దుర్మతివై । పడఁతి నను నిలిపి భిక్షం ।
బిడక కదు నవజ్ఞసేసి తేల మదమునన్ ॥

చ॥ అనినఁ బతివ్రతా తిలక మాతని కిట్లను నయ్య
మత్ప్రియుఁడు మిత క్షుధా కలితుఁడై చనుదెంచిన
భక్తి నమ్మహా । త్మునికి సపర్యసేయుచు నిను న్మదిలోనఁ
దలంపఁ జాలనై । తి నిదియుఁ దప్పుగాఁ గొనక ధీరత
నొప్పు సహింపఁగాఁ దగున్ ॥

ప్రభుల మహిమ । వినవె యెఱంగి యెఱింగి సద్వ్రత
చరిత । కొఱవిఁ గొని వెఱ్ఱినే తల గోఁకికొనఁగ ॥

వ ॥ నాతెఱంగుఁ జెప్పెద నాకర్ణింపుము.

తే- గీ ॥ పలియ చూపె నాపాలిటి పరమ దైవ ।
మేను వాఙ్మనస్స క్రియలఁ దద్ధితమ యెపుడుఁ। గోరి యొన
ంతు నిది నాకు గొనకొనంగ । ధర్మములు గాఁగ నుం
దురుఁ దలఁచి చూడ ॥

వ ॥ నీవు క్రోధనుండ వగుట యెఱుంగుదు నీకో
పంబున సుక్కు కొక్కెర నిహతంబయ్యెం గాదె యది
మదీయ పాతివ్రత్య మహిమంజేసి కాంచితిఁ గావునఁ
గ్రోధంబుఁ గొనియాడుట లగ్గుగాదని మఱియు నిట్ల
నియె ॥

తే - గీ ॥ క్రోధ మోహ నామకులైన ఘోర
శత్రు । లిరువు రెరియించు చుండెద రెపుడు నరుని ।
సంతరంగములోపల నడఁప కున్నఁ । గలదె యారత
బ్రాహ్మణ గౌరవంబు॥

సీ ॥ ఎవ్వఁడు సత్యంబు నెవ్వఁడు బల్కు హిం
సారహితుఁడు గురుజన హితార్థి । యింద్రియంబుల

నోర్చి యెల్ల వారలఁ దనయట్లకా చూచు ధర్మాభిరతుఁడు। కామంబుఁ దగులందు గర్మంబు లాఱును సముచిత సంప్రయోజిత సుసర్చు । నట్టి పుణ్యాత్ముని ననఘు బ్రాహ్మణుఁడని యనిశంబు గీర్తింతు రమరవర్యు । లార్జవంబు శమము నధ్యయనంబును । బరమ ధనము సుమ్ము బ్రాహ్మణునకు । ధర్మగతికి నవియ తగు సాధనంబులు । వేద విహిత ముఖ్య విధులు నవియ ॥

వ ॥ ధర్మంబు బహు మార్గదృష్టంబై సూక్ష్మంబైయుండు నీవు కేవల స్వాధ్యాయ పరుండవు గావున ధర్మసూక్ష్మత యెఱుంగవు కావున నడయక మిథిలానగరంబున కరుగు మందు జితేంద్రియుండును సత్యవాదియు మాతా పితృ భక్తుండును నైనవాఁడు ధర్మవ్యాధుండను కిరాతుండు నీకు నఖిల ధర్మంబు లెఱింగించి సంశయచ్ఛేదంబు సేయు నాయెడం బ్రసన్నుండవగునది వనితలకుం బరిజ్ఞానంబు లేదు గావున నాచేసి యపరాధంబు సేసినను సహింపవలయుఁ గదా యనినఁ గౌశికుం డిట్లనియె ॥

క॥ నను దూఱఁగఁ దగు నీకత। మున నాచిత్తము

ప్రశాంతిఁ బొరసెఁ బురంధ్రి । జన వినుత పోయి
వచ్చెద ననుపమ శోభనసమృద్ధి యెయ్యెడు నీకున్ ॥

వ ॥ అని యాడుణంబ యప్పుహాద్విజుండు ధర్మవ్యాధ దర్శన లాలసుండై కదలి పతివ్రత మొఱకు విస్మయం బందుచుఁ దన్నుం గృతాపరాధునింగాఁ దలంచుచు ననేక నగర గ్రామంబు లతిక్రమించి చని యనుపమాన శోభాసనాథంబైన మిథిలాపురంబు సొచ్చి రాజమార్గంబు పట్టి యచ్చటి జనుల ధర్మవ్యాధుం డున్నయెడ యడిగి వారెఱింగింప నయ్యెడ కేగి ముంగట నల్పమృగమాంస ఖండంబులం గడిం బరచి యమ్ముచున్న వాని ననవరత విక్రయాగత జన సమావృతుంగని యతి జుగుప్సితంబైన సూనాపణంబు సొరనొల్లక తొలంగి యొక్కయెడ నుండె నంత ॥

ఆ - వె ॥ వాఁడు నతని రాక పోఁడిగ నిజబుద్ధి ।
నెఱిఁగి యతని యున్న యెడకు వచ్చి । పరమ భక్తిఁ
బ్రొక్కె ధరణీసురేశ్వరుఁ । గుశల మడిగి ప్రియము
గొనలునిగుడ ॥

చ ॥ అనఘ నిరంబినీ తిలక మైన పతివ్రత నాతె
ఱంగు నై । ప్పినఁ జనుదెంచి తీవు ననుఁ బ్రీతిఁ గనుఁ
గొన నీమనోరథం । బును మదిలో నెఱుంగుదుఁ బ్రమో
దముఁ బొందితి రమ్ము మద్గృహం । బున కని పల్కి
తోడుకొని పోయె నతండు మహీసురోత్తముఁ ॥

వ ॥ కౌశికుండును ధర్మవ్యాధు నెఱుక కచ్చెరు
వంది పతివ్రత యెఱుకయుం దలంచి యిది రెండవ యా
శ్చర్యంబు గంటి నని తలంచుచుఁ దదీయ భవనంబున
కరిగి వానిచేతం బూజితుండయ్యె ॥

---

శ్రీ రస్తు.

---

# సతీహిత సంగ్రహము

## మూఁడవ భాగము.

## సత్యా ద్రౌపదీ సంవాదము.

వ॥ కృష్ణ వల్లభ యైన సత్యభామయుఁ బాంచాలియు నేకతంబ ప్రియసల్లాప సంసక్తలై యుండ సత్యభామ ద్రౌపది కిట్లనియె॥

సీ॥ నీ ప్రియ భర్తల నిర్మల చరితులఁ బ్రకట తేజుల లోకపాల నిభులఁ। బార్థుల నీవొక భంగిని వదలక చెలువ మొప్పంగ భజింతు దగిలి। యొక్కరొక్కరి కంటె నుదిత నీ కెప్పుడు నను రక్తులగుట యత్యద్భుతంబు। నగ్గు మొగంబుల కాని నాఁతి నీదెస నెప్డుఁ బతులకుఁ గిన్క యుప్పాట లేదు। వ్రతము పెంపొ మంత్రౌషధ వైభవంబొ। సరస నైపథ్య కర్మ కౌశలమొ చతుర। విభ్రమోల్లాస రేఖయో వెలఁది నీవి। శేష సౌభాగ్య హేతువుఁ జెప్పుమ నాకు॥

క॥ వినుము నీవలన నిజము। గా నిది యంతయును నెఱిఁగి కమలదళాక్షున్। బూని వశగతునిఁ జేసి య। నూన స్నేహమున భోగ యుక్తిఁ దలిర్తున్॥

క॥ అని యడిగినఁ దది నించుక। గినుక వొడమ

నడచుకొనుచుఁ గృష్ణు మృదులహా । సని యడుగుచు సత్య
భామ । గనుఁగొని యిట్లనియె నిర్వికారాకృతినై॥

కం॥ నను నిట్లు దుష్ట వనితా। జనము నటులు గాఁ
దలంపఁ జనునే నీకున్ । మన సొప్పదు పురుషోత్తము।
వనితవు గాఁదగవు నీవు వనరుహనయనా ॥

వ॥ అని పలంపుఁ జందంబుగా వివేక విహీనత
తొలుకపడ నాడి పాంచాలి మఱియు నిట్లనియె ॥

చ॥ అలయక మంత్ర తంత్ర వివిధౌషధ భంగు
లఁజేసి యెంతయున్ ।వలపురు నాధు లంట మగువా కరు
వేలతనంబు దాన మున్। గలిగిన ప్రేమయు న్బ్రీతియుఁ
గాని యొకంటను సిద్ధిఁ బొందదు । పొలఁతులతోడి
యున్కి యహిపొత్తుగఁ జూచు విభుం డెఱింగినన్ ॥

చ॥ మగువ యొనర్చు వశ్యవిధి మందులు మూ
యలు నొందు చందమై । మగనికిఁ దెచ్చు రోగములు
మానక మూక జడాది భావముల్ । మిగి నొనరించు
నగ్గురితము న్దనచేసిన చేఁతనై తుదిన్। జగమున నెక్కి
నిందయును సద్గతి హానియు వచ్చు నింతికిన్ ॥

కం॥ కావునఁ బతులకు నెప్పుడుఁ । గావింపఁగఁ
దగదు కపట కర్మంబులు ద। ద్భావ మెఱిఁగి వశవర్తిని।
నై వనిత చరింప నదియ యగు నెల్లియెడన్ ॥

వ॥ పాండవులయెడ నే నెట్టిదాననై యిట్టి సౌ
భాగ్యంబు నందితి నది నీకు నెఱింగించెద నేర్పడ
వినుము ॥

సీ॥ పతులాత్మ నుండెడు పడఁతులఁ గలసిన
పలుగ నెయ్యెడల నహంకరింప। మదముఁ బ్రమాదంబు
మాని వారికిఁ జిత్త మేకముఖంబుగ నెల్లప్రొద్దు। భక్తి
సేయుదుఁ జూపు పలుకులు గోర్కియుఁ జెయ్వులు
వింతగాఁ జేయ నెపుడు। నమర గంధర్వ యక్షాదు లందై
నను బురుషు నన్యునిఁ దృణంబుగఁ దలంతు। స్నాన
భోజన శయ నాది సంప్రయోగ। మర్థిఁ బతులకు ము
న్నెందు నాచరింపఁ। బతులు వచ్చిన నాసన పాద్య విధుల।
భక్తితో నేన కావింతుఁ బనుప నొరుల॥

చ॥ తగియెడు వేళయందు నియతంబుగ మజ్జన
భోజనక్రియల్। దగ నొడఁగూర్తు భర్తలకు ధాన్యధనం
బులు రిత్తలై వ్రయం। బగుటకు నోర్వ నెవ్వుడు గృహ
స్థల భాండ విశోధనంబు లి। మ్ముగ నొకనాఁడు నేమఱఁ
ప్రమోదము సల్పుదు బంధుకోటికిన్॥

క॥ పలుమాఱుం దలవాకిట। పెలఁగుట యసతీ జనైక మిత్రత కలహం। బుల కెలయుట నగు పలుకులఁ। బెలుచ నగుట నాకుఁ గానిపేరివి మగువా॥

క॥ పతులిచ్చు నెయ్యిఁ బ్రవాస। స్థితులైనం బుష్ప
గంధ దీప్త్యాభరణ। ప్రతతి ధరియింపఁ దద్గత। మతినగు
చుఁ దపాగమంబు మతిఁ గాంతుంతున్॥

ఉ॥ అత్తకు భక్తిగల్గి మది నాయమ చెప్పిన
మాడ్కి నెంతయున్। వృత్తము లాచరింతు గురు విప్ర
సురాతిథి భోజనంబు లత్యుత్తము భక్తి నేన తగ నొపి

నొనర్తుఁ బ్రియంబుఁ దాల్మియుఁగ । మెత్తఁదనంబు
సంతతము మేలుగఁ దాల్తు సమస్తభంగులన్ ॥

క॥ కడు మృదువు లనుచుఁ దేఁకువ । చెడి నొ
వ్వుడుఁ జక్కింప భరతసింహులు కోపం । బడరిన నాశీవిష
ముల । పరుషునఁ గ్రూరులని వెఱవు వదలక కొల్తున్ ॥

సీ॥ మా యత్త పృథ్వీ సమాన పృథాదేవి కుంతి
భోజాత్మజ కోమలాంగి । సతతంబు భోజన స్నానాదిక
ములయం దిద్దుగఁ బరిచర్య యొనచేసి । సంప్రీతిఁ
జేయుదు జనవంద్యుఁడగు ధర్మతనయుని ఇంటి నిత్యంబు
పసిఁడి । పళ్లెరంబులఁ గుడ్చు బ్రాహ్మణు లతివృద్ధు లెని
మిదివేలు సమిద్ధమతులు । యతులు పదివేలు వారల
కనుదినంబు । నన్నపానంబులందు సహాయ నగుదు ।
నుడికముగ నేన కావింతు నుచితవస్త్ర । భూషణాదుల
బరితోషముగ నొనర్తు ॥

వ॥ మఱియు ధర్మరాజు నగరియందుఁ గనక
భూషణాలంకృతులైన పరిచారకులు నూఱువేలు రేయు
నుం బగలునుం బాత్రహస్తులై యభ్యాగత భోజనంబు
లొడఁగూర్చువారు గలరు. వీరెల్ల నిట్టిట్టి పొలఁతుకల
మెలంగుదురని తత్కృత్యాకృతంబుల నేన యెఱుంగుదు
నిరంతర మద ధారా తరంగిత కపోలంబులైన భద్రగజ
శత సహస్రంబులు ప్రభూత జవ సత్త్వ సమ్పన్నంబులైన
యుత్తమాశ్వ శత సహస్రంబులుం గలవు వానికి సన్ని
హిత నిత్యోచిత ఖాద్యంబు లొసఁగింపను దగినవారి నేన

నియమింతు నఖండ భాండాగార పూరితంబులైన యా
య వ్యయంబులు నా యెఱుంగని యవి లేవు గోపాల
జనంబులు తుదిగాఁ గల సకల భృత్యజనంబుల జీవితం
బుల నరసి యేన నడపుదుఁ బరమ యశోధనులగు పాండు
నందనుల కుటుంబ భారంబు సర్వంబును నాయంద సమ
ర్పించి తారు నిర్భరులై యిష్ట విహారంబుల నుందురు
రే నెల్లవేళల నప్రమత్తనై వర్తింతు||

ఆ- వె|| వేగు జాముగలుగ వెడ నిద్రఁబొందుదుఁ।
గాని రాజ్యభార కార్యయుక్తి । నజ్జనయన నాకు నా
హార నిద్రల । కెడము లేదు సువ్వె యెల్లప్రొద్దు ॥

ఆ - వె || ఇట్టివర్తనముల నెపుడుఁ బాండవు
లకుఁ । దగిలి ప్రియము సేయఁ దగితిఁ గాని । మగువ
నీవు చెప్ప మందులు మాఁకులు । నింద్రజాలములును
నే నెఱుంగ ॥

వ || అనిన విని లజ్జాకలిత చిత్తయగుచు సత్య
భామ పాండవభామిని కిట్లనియె ||

క || ఏ నెఱుఁగమి నిట్లడిగితి । నా నేరమి సైఁప
వలయు నగవులఁ గాను మీ । మానిని నావలుకులు స।
న్మానితము భవచ్చరిత్ర మహిమ ధరిత్రిన్ ॥

వ || అనినం బాంచాలి మందస్మితానన యగుచు
సతి యట్లకాక యని పలికి మఱియు నిట్లనియె ||

చ॥ తిరిరి మురారి నీకుఁ గడుఁ దీఁపుగఁ జెప్పిన
పల్కు గల్గినన్ । కువలయనేత్ర నీపనను గూడినవారికి
నైనఁ జెప్పఁగా । వలవదు దాన గుండొక నెపంబు
గడించు తెఱింగికేని నీ పతులు కృష్ణబుద్ధి విరసంబగు
నీదెసఁ దప్పియుక్తిచేన్ ॥

వ॥ పతికి ననుంగులైన తగు బంధుల మిత్రుల భోజ
నాది స । త్కృతముల నాదరించుచు నకృత్రిమ భక్తి
విశేష సంతతో । దిత మతివై చరింపుము తదీయ హితే
తర వృత్తులైన వా । రతివ భవత్సపత్నజనము లైనను
నై కొనకుండు మెప్పుడున్ ॥

క॥ వినుఁ బ్రద్యుమ్నాది భవ త్తనయులయొడ నైన
నేకతంబున నేగా । సనమున నుండుట దూష్యం । బని
యెఱుఁగుము సతుల చరిత లతిముఖ్యరముల్ ॥

క॥ కులసతులును సతులును ని । ర్మలమతులును
నైన యట్టి మగువలతోడన్ । చెలిమి యొనరించునది
మ । గ్వలనిత వనితాధయుక్తి విడుపుము తరుణీ ॥

వ॥ ఇది నీకుఁ బరమ సౌభాగ్య మూలంబైన
యుపాయం బనినం బ్రీత చిత్తయై సత్యభామ యిట్లనియె ॥

సీ॥ నీవు ధర్మజ్ఞవు దేవసన్నిభులు నీభర్తలు
మహనీయ కీర్తిధనులు । ధైర్య తపోబల శౌర్య సంప
న్నులు గావున వీరికి నెవ్విధమున । భారతి రాజ్యంబు

సేవెదుఁ దడయక మీ కెగ్గు సేసిన లోక నింద్య । చరితుండు గౌరవ ధరణీశ వనితలు దిక్కులే కలమటఁ బొక్కుచుండఁ । గని ముదంబును బొందెద వనిత నీవు । సుకుల నత్యంత నిర్మల మతుల శౌర్య । యుతులఁ గాంచిన సద్గుణాన్వితపు వగవు । వలదు చిత్తంబులో నీకు జలజనయన ॥

వ॥ ప్రతి వింద్యాదులైన నీపుత్రులు నేళ్ళ రిప్పుడు వచ్చి యదుపురంబున నున్నవారు వారికి నొక్కటం గొఱంత లేదు రుక్మిణియు సుభద్రయుఁ దక్కిన వారలు నక్కుమారులయెడం దమకొడుకులకంటె గారవంబు సేయుదురు వారియందు నిశ్చింతవు గమ్మీకయు నయ్యవసరంబునఁ గృష్ణుండు పాండవుల వీడ్కొని మార్కండేయాది విప్రజనంబుల నామంత్రణంబు సేసి గమనోన్ముఖుండగుటయు సత్యభామ యాజ్ఞ సేసిం గొఁగిలించుకొని సగౌరవంబుగా వీడ్కొని నంత వాసుదేవుండును బ్రియా సహితంబుగా రథారూఢుండై ద్వారవతీ పురంబున కరిగె ॥

సీ॥ స్నానంబుఁ గావించి చనుదెంచునంతలో జపవే
దిఁదగురీతి సవరుఁజేయు। జపనిష్ఠ మొనరించి చాలించునం
తలోఁ జక్కఁగా దేవపూజకు సమర్చు। దేవపూజ మొనర్చి
తిలకించునంతలో షడ్రసాపూర్ణ భోజనముఁ బెట్టు। భోజనం
బయి కరంబులు గడుగునంతలోఁ బర్ణాజినములచేఁ బా
న్పొనర్చుఁ। బాన్పుపైఁ జేరునంతలో బడలిరనిమ। నంబుసఁ
దలంచి తాళవృంతమున విసరి। తొడలపై నంఘ్రులుంచి
మొత్తుచున నేక। సేవలొనరి[redacted]న్పు గుర్తుబోఁడి॥

